సంపుటము 3] ఏప్రిల్ 1917 [సంచిక 10

# బాలమిత్ర





జపాను స్త్రీ

# జపాన్ దేశము

ప్రియమైన పిల్లలారా!

మనము ఆయాదేశములనుగూర్చి నేర్చుకొనుచున్నాము. ఈ నెలలో జపాన్ దేశమునుగూర్చి విందము. జపాను, ద్వీపముల సముదాయము, మధ్యదీవిలోని వారు పొట్టివారు. ఉత్తర దక్షిణ దీవులలోని వారు వారికంటె పొడగరులు, వారి శరీరరంగు పసిమివర్ణము. వారివి సోగ కన్నులు వెండ్రుకలు బహు నల్లనివిగాన సొగసుగా నుండును. జపానులోని యిండ్లు కర్రతో కట్టెదరు. కిటికీలకు అద్ద మునకు ప్రతిగా కాగితమును వాడెదరు. బయట నున్న వారు లోపలను, లోపలివారు వెలపటను చూడజాలరు. ఈ కిటికీలు జారుడుగా నుండునుగాన లోనివారు చూడదలంచిన యెడల వాటిని ఒక ప్రక్కకు జరిపి చూడవచ్చును. జపాను వారికి కుర్చీలుగాని అటువంటి యితర సామగ్రి లేదు. అయితే మంచి చాపలున్నవి మంచములు లేవుగాని మంచి పరుపులు గలవు. వారి తలగడ దిండ్లు చిత్రమైనవి పటములో వాని చూడవచ్చును. మన దిండ్లవలె మెత్తనైనవి కావు. గాని కొయ్యతో చేయబడినవి. వారు ముఖ్యముగా వ్యవసాయ కులు. వరిపంట ఆ దేశములో ముఖ్యమైనది.



జపాను స్త్రీయును, ఆమె బిడ్డయును

జపానువారు అందమును బహుగా ప్రేమింతురు. పువ్వుల కొరకు మాత్రము మంచి పూలతోటలను వేతురు. కొంచె.

మొత్తువరకు మాత్రమే ఎదుగుచెట్లను పెంచుటలో మిగుల నేర్పరులు, ఆ చెట్లలో కొన్ని 200 ఏండ్ల ప్రాయముగలవి గాని అవి ఒక అడుగుకంటె ఎత్తుగాలేవు. వారు వీటిని అలంకారమున కుపయోగింతురు.



జపానువారి పరుపు

జపానీయులు బహు శుభ్రము గలవారు వారు తమ ఇండ్లను, వీధులను బహు శుభ్రముగాను అందముగా

నుంతురు. ఎంతపని తొందరయైనను, తోలు చెప్పులతో నింటిలో ప్రవేశింపరు. తలుపువద్దనాగి అక్కడ గుడ్డచెప్పుల వేసికొని లోన ప్రవేశింతురు. రైలుబండ్లలోను గుడ్డచెప్పులనే వేసికొనవలెను. తోలు చెప్పులను గార్డు జాగ్రత్తచేయును.

జపానువారు చాల రాజభక్తిగలవారు తమదేశము నెంతో ప్రేమింతురు. "తన దేశముకొరకు, శరీరమును ప్రాణము నిచ్చు మనుష్యుడు సౌఖ్యవంతుడు" అని ఒక జపాను విద్యార్థి చెప్పెను.

మన ఇండ్లను, శరీరములను శుభ్రముగా నుంచుకొనుటకును, మన దేశమును వీరివలె ప్రేమించుటకు నేర్చుకొందుముగాక.

---

## చిన్నిసిపాయి ప్రకాశము

టప్, టప్, టప్ మనుచు చిన్ని ప్రకాశము, పెద్ద తలగుడ్డ నెత్తిమీద బెట్టుకొని, జెండానొకటి భుజముపై నుంచుకొని, చేత నొక చిన్న తుపాకి పట్టుకొని, అటుయిటు పచారుచేయుచుండెను.

"చాల ధైర్యముగల సిపాయిని, ఎలుగ్గొడ్డుగాని సింహముగాని, వస్తే ఒక్క దెబ్బన చంపిపారవేస్తా" అనెను.

“నేను సుబేదారుణ్ని, సిపాయి, నా ఆజ్ఞ విన్న తత్క్షణమే లోబడవలెను. ఏదీ, నీవు మంచి సిపాయివేమో చూతాము. ఆ క్రిందపడ్డ దారము మిట్లా తే.” ఆమాట ముగిసి ముగియక మునుపే ప్రకాశము దారము తల్లి కందించెను. “పరుగెత్తు కొంటూ వెళ్లి చల్ల అమ్మిణో కాణి చల్లకావలెనని చెప్పు” ప్రకాశము పరుగెత్తి నిమిషములో ఆపని జేసెను.

“ఇంకొక ఆజ్ఞ, వంటగదిలోకిపోయి సుబేదారునికి సిపాయికి కొన్ని అరిసెలు పట్టుకొనిరమ్ము.”

“ఓ, అదెంత సేపు. నాకంటె ఎవరైనా ముందు తేగలరా?” అనుచు ప్రకాశము పరుగెత్తెను. అతడు సగము దోవలో నుండగానే తల్లి “ఆగు ఇటుతిరిగి తోటలోకిబోయి కలుపుదీయుము” అని చెప్పెను. వెంటనే ప్రకాశము కలుపు దీయ తోటలోకి బోయెను.

అతనికేమి బహుమానము వచ్చిన దనుకొంటారు. తల్లి రెండు మంచి పెద్ద అరిసెలతని కిచ్చెను. విధేయత కెట్టి బహుమానమో చూడుడి.

ప్రియపిల్లలారా! మీరు మీ సుబేదారగు యేసుక్రీస్తుకు విధేయులుగా నుంటున్నారా? ప్రకాశము తన తల్లికెట్లు విధేయత చూపెనో చూడుడి. యేసు కోరునట్లు మంచిపనులనే మనము జేయుచు, ఆయనయొక్క మంచిభటులమై యుందముగాక!

# ఒంటె



ఒంటె మిక్కిలి పెద్దజంతువుగాన మహాంగమనబడుచున్నది. 8, 9, అడుగుల ఎత్తుండును, వికారముగా నుండును. జాజికాయవర్ణము గలిగియుండును. గడ్డి ఆకులు గోధుమలు మొదలయినవాటిని తినును. శాంతముగలది, యజమానుడు ప్రియముగా నడిపించినప్పుడు లోబడియుండును. కొట్టిన యెడల లోబడక మొండితనముచేయును. సంవత్సరమున కొకతూరి ఒక పిల్లను కనును. విశేషముగా పండుకొని యుండుటయందు ఇష్టముగలది. ఆకలి దప్పి 10 రోజులవరకు

నోర్చియుండును. తల చిన్నది. కండ్లు పెద్దవి. కనుబొమలు కండ్లపై వ్రాలియున్నవి. ఇట్లుండుటవల్ల ఎండయొక్క బాధ లేక యుండును. ఎడారులలో కంటిలో దుమ్ముపడక యుండును. ముక్కు నిడివిగాను ద్వారములు వెడల్పుగాను మూసికొనుటకును తెరచుటకును వీలుకలవిగా నున్నవి. ఇట్లుండుటవల్ల ఎడారులలో యిసుకగాలి మొదలగువానియొక్క బాధకు తప్పించుకొనును. పై పెదవి రెండుభాగములుగా నున్నది. ముందరిపండ్లు కఱకుగాను దవుడపండ్లు వెడల్పుగాను ఉన్నవి. అందువల్ల గడ్డి ఆకులు మొదలయిన వానిని పెరకుటకును నెమరువేయుటకును వీలుగానున్నది. గొంతు మిగుల నిడివిగానున్నది. వంగి ఆహారమును తినుటకు వీలుగానున్నది. కాళ్లు సన్నముగనున్నవి. మిక్కిలి బలముగలవి. పాదములు మెత్తవిగాను అడుగున వెడల్పుగాను చీలిన గిట్టలు గలవిగా నున్నవి. తోక పొట్టిదిగాను కొనయందు వెంట్రుకలు గలదిగా నున్నది. అనేక దేశముల ఒంటెలకు వొక మూపును కొన్ని దేశముల ఒంటెలకు రెండు మూపులును యుండును. ఆహారమువల్ల కలుగు కొవ్వుచేరి యీ మూపు గలుగుచున్నవి. ఆహారము దొరకనప్పుడు సారము మూపునుండి దేహమునకు పారి పుష్టినిచ్చుచున్నది. ఇట్లుండుటవల్ల ఆహారము దొరకని ఎడారులలో ప్రయాణము చేయుటకొరకు సాధకముగా

నున్నది. కడుపులో రెండు తిత్తులున్నవి. ఆ తిత్తులు నీళ్లతో నింపుకొని దినమునకు కొంచెము కొంచెముగా నొకవారము వరకు దేహశాంతి చేసికొనును. చర్మము దళమైనదిగాను వెండ్రుకలచేత కప్పబడినదిగా నున్నది. ఆవునువలెనే నాలుగు జీర్ణకోశములున్నవి. ఇట్లుండుటవలన నెమరువేయుటకు వీలుగానుండును.

ఎడారులలో బరువైన మూటలు మోయుటకును ప్రయాణము చేయుటకును మిక్కిలి ఉపయోగము. అరాబియా దేశస్థులు దాని పాలు త్రాగుదురు. దాని మాంసమును తిందురు. దాని చర్మముచే గుడారములు పాదరక్షలు సిద్దెలు మొదలయినవి చేయుదురు. దాని రోమములతో కంబళ్లు నేయుదురు. ఆహారమును తినుట నెమరువేయుట యీ విషయములలో ఆవును పోలియున్నది. దానికి అరేబియా యెడారి ముఖ్యస్థానము. దానికి ఎడారియోడ యని పేరు. అది ఇండియా, ఈజిప్టు దేశములలో కూడా కలదు.

---

# దేవదానముయొక్క గెలుపు

తరగతియందు దేవదానము వృద్ధిపొందుచుండెను. పూర్వమువలె చదువునందంతగా తప్పులు చేయుటలేదు.

ఉపాధ్యాయుడును ఓపికతో తప్పుల దిద్దుచుండెను. దేవదానము మంచిపిల్లవాడగుటకు ప్రయత్నించుచుండెనుగాని చెడ్డఅలవాటులన్నియు నొక్కమారే విడచుట అసాధ్యముగా నుండెను. కొన్ని పర్యాయములు అధైర్యపడినను, పట్టుదలతో తన యుద్యమమును కొనసాగించుచుండెను. అన్నిటిలో లెక్కలు అతనికి కష్టమైన పాఠమై యుండెను.

ఒక దినము తన యింటికడ లెక్క నొకదానిని ఐదవ పర్యాయము చేయ యత్నించుచుండ, కొన్నికట్టెల గొట్టి పెట్టుమని తల్లి యడిగెను. త్వరగా రమ్మని అక్కగారు త్వరపెట్టుచుండ, విసుకుతో లేచి కట్టెలగొట్టి, మరల నాలెక్కను చేయకూడ దనుకొనెను. అయినను ఇంకొకమారు ప్రయత్నము చేతుననుకొని కూర్చుండి, నొక్కమాటలో తాను పొరబడుటచూచి, దాని యర్థము నెవరు చెప్పెదరా యనుకొనుచుండెను. బడిపిల్ల లెవరు సమీపమునలేరు. తండ్రిగారొక వడ్రంగియే. అయిన నతడు కొన్ని పర్యాయములు లెక్కల వ్రాయుట నీకుఱ్ఱడు చూచియుండుటచే నతని కడకుపోయి నాలెక్కను చదివి వినిపించెను. రోగియైయుండిన తండ్రి కొంచె మాలోచించి కొమరునకు దాని యర్థము చెప్పెను. అతడు కుతూహలుడై యవలీలగ నాలెక్కను జేయకలిగెను.

మరునాడు బడిలో నా క్లాసువారి యొకలెక్క జేయ లేక పోయిరిగాని దేవదానము యొక్కడే దాని చేసెను. అంతట వాని ఉపాధ్యాయుడు వాని యాసక్తిని, వృద్ధిని జూచి పైక్లాసులో నతని నుంచెను. దేవదానము యొక్క ఆశ్చర్యానందములచెప్ప నలవికాదయ్యె. మరియు నతడు తన ప్రయత్నముచేతను, సుబుద్ధిచేతను, క్లాసులో మంచి పేరునొంది గొప్ప విద్యార్థియాయెను.

---

# ప్రకృతి పాఠములు

## 32 వ పాఠము



వాసన

చుట్టునున్న ప్రపంచములోని సంగతులను, చూచుట వలనను, వినుటవలనను మనస్సు విశేషముగా దెలిసికొనుచున్నదని చెప్పియుంటిని. ఇతరేంద్రియములవలనను అది ఇంకను ఎక్కువగా దెలిసికొనుచునే యున్నవి.

నీవెట్లు దేనినైనను వాసన చూచుచున్నావో తలంచి యుంటివా? ముక్కుదగ్గర గులాబిపుష్పమును పెట్టుకొన్నప్పుడు మంచి వాసన గొట్టును గదా! ఈ వాసన యేమిటి? ఏదైనా నీ ముక్కులోనికి బోయినందున ఆలాగు గొట్టుచున్నదా? గులాబి పుష్పమునుండి ఏదియు వచ్చుచున్నట్లు మనము చూడజాలము. గాని బహు సన్నని పొడివంటి పదార్థము ముక్కులోనికి బోవుచున్నవి. ఇవి కంటికి కగుపడనంత సన్ననివి. అవి గాలిలో ఎక్కడ జూచిన నక్కడ వ్యాపించి ముక్కు రంధ్రములలోనికి బోవును. నీవు చూచు ప్రతి వాసనయు ఇట్టి సన్నని పొడివలననే కలుగుచున్నవి.

అయితే ఈ వాసన సంగతి మనస్సున కెట్లు తెలియును? ముక్కులోపల అంతయును, వాసననాడుల కొనలు వేలకొలదిగ నున్నవి. అది సైతము కంటికి కనుబడనంత చిన్నవి. ఆచిన్న కణము లీనాడుల కొనలకు తగిలినప్పుడవి యీ సంగతిని మనస్సునకు దెలుపును.

ముక్కు కొన్ని ఇతరావయవములకంటె మిగుల విరివి గలది. దానియందు భాగములును గలవు. ఇవి ఒకదానిలో నొకటి మెలికలుపడి ముక్కునందు చాల స్థలమేర్పడునట్లును ఈ ప్రదేశ మంతటిలోను, నాడుల కొనలుండు నట్లును జేయుచున్నవి.

కొన్ని జంతువులకు వాసనజూచుశక్తి విశేషముగా నుండును. వానిలో ముక్కులోని భాగము లెక్కువ స్థలము నాక్రమించుకొని, ఎక్కువ ప్రదేశములో ఈ నాడులను వ్యాపింపజేయును. కుక్క తన యజమానుని ఎచ్చట నున్నను చక్కగా పసిపట్టగలదను సంగతి నీకు తెలియునుగదా. పిల్లి, ఎలుకలును చుంచులెక్కడ నుండునో పసిపట్టగలదు.

కొందరు మనుష్యులు వాసన ద్వారా ఆయా వస్తువులను వేరుపర్చగలరు. ఒకగుడ్డివాడు తాను చూడజాలకపోయినను, పిల్లిగాని కుక్కగాని దగ్గరకు వచ్చినప్పుడు వెంటనే ఫలానిది వచ్చినదని చెప్పగలడు. ఒకసారి పిల్లియొకటి దగ్గరగా నున్నదని ఎంతో వాదించెనుగాని, చుట్టునున్నవారు లేదని ఎంత చెప్పినను వినడాయెను. వారదియంతా వెదకిచూడగా మూలను కుండలసందున నది యున్నట్లు కనుగొనిరి.

ఇట్టి సువాసనలవలన మనకెంతో సంతోషము గలుగుచున్నది. మనము ఆనందించునట్లు భగవంతుడు భూమియంతట నిట్టి పరిమళముగల పుష్పాలను వెదజల్లియున్నాడు. మొదటి భాగములో వానినిగూర్చి చదివియుంటిమి. కొన్నిచెట్లు విషకరమైనవి. గాన వాటినుండివచ్చు వాసన సహింపరానిదిగా నుండును. అప్పుడు మనము వాటిజోలికి పోరాదని హెచ్చరించును.

ఇట్టి గొప్పమేలు లిచ్చినందుకు మనము భగవంతునికి వందనములు చెల్లించవలెను.

---

# బైబిలు పిల్లలు

## యెహూషువా

బాలమిత్రులారా! మనము ఇదివరకు మోషేను గురించి చదివియున్నాము గదా? మోషే ఇశ్రాయేలీయుల ఐగుప్తునుండి కానానునకు అరణ్యమార్గము తీసికొనివచ్చుచూ, మార్గములోనే మరణమొందెను. అప్పుడు వారిని మనము చదువబోయెడి యీ యెహూషువాయే కానానునకు తీసికొని పోయెను. మోషే యొద్ద ఇతడు బాగుగా తరిబీతునొందెను. మంచి నమ్మకము గలవాడుగాన, మోషే కానానునకు వేగు చూడపంపెను. ఇతడును కాలేబును కానానునుండి ద్రాక్ష గెలను మోషేకడకు మోసికొనివచ్చి యీ దేశము బహు సారవంతమైనదనియు ప్రభువు సహాయమున యీదేశస్థుల గెలచి దాని స్వాధీనపరచుకొనగలమనియు వర్తమానము తెచ్చెను. యెహూషువా మోషే బ్రతికియుండగా సేనాధిపతిగా నియమించబడి అమాలేకీయులమీదికి యుద్ధమున కంప

బడినపుడు బహు నేర్పరితనముచేత యుద్ధముజేసి అమాలేకీయులఅపజయ మొందించెను. మోషే ఐగుప్తునుండి ఇశ్రాయేలీయుల గొంచువచ్చినప్పుడు పసుచువాడు మోషే ఇతని చిన్నతనమునుండి బాగుగా ఎరిగినవాడు. ఇతని తండ్రి నూను. ఇతని బాగుగా భయభక్తితోను అదుపుతోను పెంచినందున ఇతడు ఎదిగినకొలది సుగుణములతోను అప్పగించబడిన పనుల బహు పట్టుదల నమ్మకములతోనుచేయు మంచి యభ్యాసము అలవడెను. మొదట చిన్న చిన్న పనులలో నమ్మకముగా యున్నందున ఇతని గొప్ప గొప్ప పనులకు మోషే నియమించెను. పిల్లలారా! మనమును చిన్న పనులలో నమ్మకముగానున్న మనకును ఇట్టియాశీర్వాదము ప్రభువు తప్పక అనుగ్రహించును.

(సశేషము)

---

# బాలమిత్ర టపా

ప్రియమైన బాలమిత్రులారా!

నేను ప్రతినెల యీ పత్రికను చదువుచున్నందున యెక్కువ సంతోషము కలుగుచున్నది. అదిమాత్రమేగాక నా పనికికూడ ఎంతో సహాయము కలుగుచున్నది. ఎట్లనగా 1913 సం|| మా నెల్లూరియందు బైబిల్ ట్రేనింగ్ ఆరంభించిరి. అప్పుడు 12 మంది బాలికలు బోర్డింగు బడిలో చేరిరి. మాతో ౭గురు బైబిల్ స్త్రీలుకూడ తరగతికివచ్చి బైబిల్ నేర్చుకొనుచుండిరి. ఆ

సమయములో మేమందరము బైటకు జనానాపనికివెళ్లి హిందువులతో మాట్లాడునపుడు బాలమిత్రలోని కథలు, దృష్టాంతములు మేము మాట్లాడే అంశములకు సరిపోవునవి వారు గ్రహించునట్లు చెప్పెడివారము. అదిమాత్రమేగాక మా మిసమ్మగారు మమ్మును ఆయాకూటములు నడిపించమని అంశములు ఇచ్చినపుడు ఈ పత్రికలలోనివి దృష్టాంతముగా చెప్పెడివారము మరియు క్రిస్మస్ దినము, క్రొత్తసంవత్సరము, మా మిసమ్మగారి పుట్టుకరోజున ఆయా సంతోష సమయములలో ఈ పత్రికలలోని సంభాషణలు, కథలు, డైలాగుల మూలమునను, సంభాషణల మూలమునను యితరుల డెందములకు ఆనందము కలుగునట్లు వినిపించెదము. గనుక ఈ పత్రికలవలన మా బడిలో యున్నవారందరికి చాల సహాయము కలుగుచున్నది. ప్రతినెల ఈ పత్రికలలో పాలుపుచ్చుకొనే వారందరికి మా వందనములు. మరియొకసంగతి యేమనగా, మా ప్రియ ప్రిన్సిపల్ గారైన మొరేజ్ మిసమ్మగారు ఈ మార్చినెలలో తమ స్వదేశము వెళ్లనై యున్నారు. ఆమెగారు ఆత్మసంబంధముగా మేము ఎదుగునట్లు చేయుటమాత్రమేగాక, నశించిపోవుచున్నవారికి నిజదేవునిగూర్చి చెప్పే విధము మాకు చక్కగా నేర్పునట్లుచేసిన దేవునికి ఆమెకై మేమెంతో కృతజ్ఞులమై యున్నాము అనేకమంది మన దేశస్థులు ఆత్మీయ బ్రతుకునందు చిన్నపిల్లలవలె యున్నారు. గనుక చాలమంది దేవునివాక్యములో మొదట తర్ఫీతుపొంది దేవుని సేవచేయుటకును చాలమందిని ఈ బడికి పంపునట్లు ప్రార్థించుటకు మేము మీకందరికి తెలుపుచున్నాము.

దీనిని చదువువారందరికిన్ని, ఈ పత్రికలలో పాలుపుచ్చుకొనిన వారందరికిన్ని నా వందనములు.

ఇట్లు ప్రియబాలమిత్రురాలు,

డి. యస్. పద్మణి, బైబిల్ ట్రేనింగ్ స్కూల్,

వినుకొండ

C. L. S. PRESS, MADRAS—1917